# అథ షట్ చత్వారింశో%ధ్యయః

## మహిషాసుర వధ

ఋషిరువాచ |

ఆసీద్రంభాసురో నామ దైత్యవంశశిరోమణిః | తస్మాజ్జాతో మహాతేజా మహిషో నామ దానవః || 1

స సంగ్రామే సురాన్ సర్వాన్ నిర్జిత్య దనుజాధిపః | చకార రాజ్యం స్వర్లోకే మహేంద్రాసనసంస్థితః || 2

పరాజితాస్తతో దేవా బ్రహ్మాణం శరణం యయుః | బ్రహ్మాపి తాన్ సమాదాయ య¸° యత్ర వృషాకపీ || 3

తత్ర గత్వా సురాస్సర్వే నత్వా శంకరకేశవౌ | స్వవృత్తం కథయామాసుర్యథావదనుపూర్వశః || 4

భగవంతౌ వయం సర్వే మహిషేణ దురాత్మనా | %◌ుజ్జాసితాశ్చ స్వర్లోకాన్నిర్జిత్య సమరాంగణ || 5

భ్రమామో మర్త్యలోకే% స్మిన్న లభేమహి శం క్వచిత్ | కాం కాం న దుర్దశాం నీతా దేవా ఇంద్రపురోగమాః || 6

సూర్యాచంద్రమసౌ పాశీ కుబేరో యమ ఏవ చ | ఇంద్రాగ్నివాతగంధర్వా విద్యాధరసుచారణాః || 7

ఏతేషామపరేషాం చ విధేయం కర్మ సో%సురః | స్వయం కరోతి పాపాత్మాదైత్యపక్ష భయంకర || 8

తస్మాచ్చరణమాపన్నాన్ దేవాన్నస్త్రాతుమర్హథః | వధోపాయం చ తస్యాశు చింతయేథాం యువాం ప్రభూ || 9

ఇతి దేవవచశ్రుత్వా దామోదర సతీశ్వరౌ | చక్రతుః పరమం కోపం రోషాఘూర్ణితలోచనౌ || 10

ఋషి ఇట్లు పలికెను -

రాక్షసవంశములో శ్రేష్ఠుడగు రంభుడనే రాక్షసుడు ఉండెను. వానికి మహాతేజశ్శాలియగు మహిషాసురుడనే పుత్రుడు ఉండెను (1). ఆ రాక్షసరాజు యుద్ధములో దేవతలనందరినీ ఓడించి స్వర్గలోకములో మహేంద్రుని ఆసనముపై స్థిరముగా కూర్చుండి రాజ్యమునేలెను (2). అపుడు పరాజయమును పొందియున్న దేవతలు బ్రహ్మను శరణుజొచ్చిరి. బ్రహ్మ వారిని దోడ్కొని విష్ణువు, శివుడు ఉన్న స్థానమునకు వెళ్లెను (3). దేవతలందరు అచటకు వెళ్లి శివవిష్ణువులకు నమస్కరించి తమ వృత్తాంతమును ఉన్నది ఉన్నట్లుగా సరియగు క్రమములో చెప్పిరి (4). ఓ భగవానులారా! దుర్బుద్ధియగు మహిషుడు మమ్మలనందరినీ యుద్ధరంగములో జయించి స్వర్గలోకమునుండి వెళ్లగొట్టినాడు (5). మేము ఈ మనుష్యలోకములో తిరుగాడుచున్నాము. మాకు ఎక్కడైననూ సుఖము లభించుట లేదు. ఇంద్రుడు మొదలగు దేవతలు పొందని దుర్దశ ఏమి గలదు? (6) సూర్యచంద్రులు, వరుణుడు, కుబేరుడు, యముడు, ఇంద్రుడు, అగ్ని, వాయువు, గంధర్వలు, విద్యాధరులు, చారణులు మొదలగు వారిచే చేయబడదగిన కర్మలను పాపాత్ముడగు ఆ రాక్షసుడు స్వయముగా చేయుచున్నాడు. రాక్షస పక్షమునకు భయమును కలిగించు ఓ దేవా! (7,8) కావున శరణు పొందిన మా దేవతలను మీరిద్దరు రక్షించదగుదురు. మీరిద్దరు ప్రభువులు శీఘ్రముగా వానిని వధించే ఉపాయమును ఆలోచించుడు (9). దేవతల ఈ వచనములను విని శివవిష్ణువులిద్దరు కోపమును పొందిరి. వారి కన్నులు కోపముచే తిరుగుచుండెను (10).

తతో%తికోపపూర్ణస్య విష్ణోశ్శంభోశ్చ వక్త్రతః | తథాన్యేషాం చ దేవానాం శరీరాన్నిర్గతం మహః || 11

అతీవ మహసః పుంజం జ్వలంతం దశదిక్షు చ|
అపశ్యంస్త్రిదశాస్సర్వే దుర్గాధ్యానపరాయణాః || 12

సర్వదేవశరీరోత్థం తేజస్తదతి భీషణమ్ | సంఘీభూయాభవన్నారీ
సాక్షాన్మహిషమర్దినీ || 13

శంభుతేజస ఉత్పన్నం ముఖమస్యాస్సుభాస్వరమ్ | యామ్యేన బాలా
అభవన్ వైష్ణవేన చ బాహవః || 14

చంద్రమస్తేజసా తస్యాస్తనయుగ్మం వ్యజాయత | మధ్యమైంద్రేణ
జంఘోరూ వారుణ   న బభూవతుః || 15

భూతేజసా నితంబో%భూద్ర్బాహ్మేణ చరణద్వయమ్ | ఆర్కేణ
చరణాంగుళ్యః కరాంగుల్యశ్చ వాసవాత్ || 16

కుబేరతేజసా నాసా రదనాశ్చ ప్రజాపతేః | పావకీయేన నయనత్రయం
సాంధ్యేన భ్రూద్వయమ్ || 17

ఆనిలేన శ్రవోర్ద్వంద్వం తథాన్యేషాం స్వరోకసామ్ | తేజసా సంభవః
పద్మాలయా సా పరమేశ్వరీ | 18

తతో నిఖిలదేవానాం తేజోరాశి సముద్భవామ్ | తామాలోక్య
సురాస్సర్వే పరం హర్షం ప్రపేదిరే || 19

నిరాయుధాం చ తాం దృష్ట్వా బ్రహ్మాద్యాస్త్రిదివేశ్వరాః | సాయుధాం
తాం శివాం కర్తుం మనస్సందధిరే సురాః || 20

తరువాత అతిశయించిన కోపమును పొందియున్న శివవిష్ణువుల ముఖములనుండియు, మరియు ఇతర దేవతల శరీరమునుండియు తేజస్సు బయుల్వెడలెను (11). దుర్గను ధ్యానించుటలో నిమగ్నులై యున్న సకలదేవతలు పదిదిక్కులలో ప్రకాశించుచున్న మహాతేజోరాశిని చూచిరి (12). సకల దేవతల దేహములనుండి పుట్టిన మహాభయంకరమగు ఆ తేజస్సు ఒకచోటకు ముద్దగా చేరి సాక్షాత్తుగా మహిషాసురుని మర్దించే స్త్రీ రూపమును దాల్చెను (13).

శివుని తేజస్సు నుండి మిక్కిలి ప్రకాశించే ఆమెయొక్క ముఖము, యముని తేజస్సుచే కేశములు, విష్ణుతేజస్సుచే బాహువులు (14), చంద్రుని తేజస్సుచే ఆమె స్తనద్వయము, ఇంద్రుని తేజస్సుచే నడుము, వరుణుని తేజస్సుచే ఊరువులు, భూమియొక్క తేజస్సుచే నితంబము, బ్రహ్మతేజస్సుచే రెండు పాదములు, సూర్యతేజస్సుచే కాలివ్రేళ్లు, ఇంద్రతేజస్సుచే చేతివ్రేళ్లు, కుబేరుని తేజస్సుచే ముక్కు, ప్రజాపతి తేజస్సుచే దంతములు, అగ్ని తేజస్సుచే మూడు కన్నులు, సంధ్యా తేజస్సుచే రెండు కనుబొమలు, వాయుతేజస్సుచే రెండు చెవులు నిర్మాణమయ్యేను. మరియు ఇతరదేవతల తేజస్సుల కలయికచే ఆ పరమేశ్వరి ఆవిర్భవించెను. ఆమె పద్మమునందు కూర్చుండెను (15-18). అపుడు సకల దేవతల తేజస్సుల రాశి నుండి ఆవిర్భవించిన ఆమెను చూచి దేవతలందరు మహానందమును పొందిరి (19). స్వర్గాధిపతులగు బ్రహ్మ మొదలగు దేవతలు ఆ శివాదేవి వద్ద ఆయుధములు లేకుండుటను గాంచి, ఆమెకు ఆయుధములను సమకూర్చుటకు నిశ్చయించుకొనిరి (20).

తతశ్శూలం మహేశానో మహేశాన్యై సమర్పయత్ | చక్రం చ కృష్ణో భగవాన్ శంఖం పాశం చ పాశభృత్ || 21

శక్తిం హుతాశనో%యచ్ఛన్మారుతశ్చాపమేవ చ | బాణపూర్ణేషుధీ చైవ వజ్రఘంటే శచీపతిః || 22

యమో దదౌ కాలదండమక్షమాలాం ప్రజాపతిః | బ్రహ్మా కమండలుం ప్రాదాద్రోమరశ్మీన్దివాకరః || 23

కాలః ఖడ్గం దదౌ తస్మై#్య ఫలకం చ సముజ్జ్వలమ్ | క్షీరాబ్ధీ రుచిరం హారమజరే చ తథాంబరే || 24

చూడామణిం కుండలే చ కటకాని తథైవ చ | అర్ధచంద్రం చ కేయూరాన్నూపురౌ చ మనోహరే || 25

గ్రైవేయకమంగులీషు సమస్తాస్వంగులీయకమ్ | విశ్వకర్మా చ పరశుం దదౌ తస్సై#్య మనోహరమ్ || 26

అస్త్రాణ్యనేకాని తథా% భేద్యం చైవ తనుచ్ఛదమ్ | సురమ్యసరసాం మాలాం పంకజం చాంబుధిర్దదౌ || 27

దదౌ సింహం చ హిమవాన్ రత్నాని వివిధాని చ | సురయా పూరితం పాత్రం కుబేరో%స్సై#్య సమర్పయత్ || 28

శేషశ్చ భోగినాం నేతా విచిత్రరచనాంచితమ్ | దదౌ తస్సై#్య నాగహారం నానాసన్మణి గుంఫితమ్ || 29

ఏతైశ్చాన్యైస్సురైర్దేవీ భూషణైరాయుధైస్తథా | సత్కృతోచ్చైర్ననాదాసౌ సాట్టహాసం పునః పునః || 30

అపుడు మహేశ్వరుడు మహేశ్వరికి శూలమును, శ్రీకృష్ణభగవానుడు చక్రమును, వరుణుడు శంఖమును మరియు పాశమును, అగ్ని శక్తిని, వాయువు ధనస్సును మరియు బాణములతో నిండియున్న అంబుల పొదులను రెండింటిని, ఇంద్రుడు వజ్రమును మరియు గంటను, యముడు మృత్యుదండమును, ప్రజాపతి అక్షమాలను, బ్రహ్మ కమండలమును, సూర్యుడు రోమములయందు కిరణములను, మృత్యుదేవత కత్తిని మరియు గొప్పగా ప్రకాశించే డాలును, క్షీరసముద్రుడు ప్రకాశించే హారమును, రెండు నూతనవస్త్రములను, చూడామణిని, కుండలముల జంటను, హస్తాభరణములను, చంద్రవంక అనే ఆభరణమును, కేయూరములను, సుందరమగు నూపురములను, మెడలో హారమును, వ్రేళ్లకు అన్నింటికీ ఉంగరములను, విశ్వకర్మ సుందరమగు గండ్ర గొడ్డలిని, అనేకములగు అస్త్రములను, మరియు ఛేదింప శక్యము కాని కవచమును, సముద్రుడు మిక్కిలి సుందరము రసవత్తరము అగు మాలను మరియు పద్మమును, హిమవంతుడు సింహమును మరియు వివిధరత్నములను, కుబేరుడు సురతో నిండియున్న పాత్రను, సర్పములకు అధీశ్వరుడగు శేషుడు రంగు రంగుల రచనలతో

ప్రకాశించునది మరియు అనేకములగు మంచి మణులు పొదిగినది అగు నాగహారమును సమర్పించెను (21-29). దేవతలు ఇవియే గాక ఇతరములగు భూషణములతో మరియు ఆయుధములతో దేవిని సత్కరించిరి. ఆమె అనేకపర్యాయములు అట్టహాసమును మరియు బిగ్గరగా నాదమును చేసెను (30).

తస్యా భీషణనాదేన పూరితా చ నభః స్థలీ | ప్రతిశబ్దో మహానాసీ
చ్చుక్షుభే భువనత్రయమ్ || 31

చేలుస్సముద్రాశ్చత్వారో వసుధా చ చచాల హ | జయశబ్దస్తతో
దేవైరకారి మహిషార్దితైః || 32

తతో%ంబికాం పరాం శక్తిం మహాలక్ష్మీ స్వరూపిణీమ్ | తుష్టువుస్తే
సురాస్సర్వే భక్తి గద్గదయా గిరా || 33

లోకం సంక్షుబ్ధ మాలోక్య దేవతాపరివంథినః | సన్నద్ధసైనికాస్తే చ
సముత్తస్థురుదాయుధాః || 34

మహిషో%పి చ తం శబ్దమభ్యధావద్రుషాన్వితః | స దదర్శ తతో దేవీం
వ్యాప్తలోకత్రయాం రుచా || 35

ఏతస్మిన్నంతరే తత్ర మహిషాసురపాలితాః | సమాజగ్ముర్మహావీరాః
కోటిశో ధృతహేతయః || 36

చిక్షురశ్చామరోదగ్రౌ కరాలోద్ధతబాష్కలాః | తామ్రోగ్రాస్యో%గ్ర వీర్యాశ్చ
బిడాలో%ంధక ఏవ చ || 37

దుర్ధరో దుర్ముఖశ్చైవ త్రినేత్రశ్చ మహాహనుః | ఏతే చాన్యే చ
బహవశ్శూరా యుద్ధవిశారదాః || 38

యుయుధుస్సమరే దేవ్యా సహ శస్త్రాస్త్ర పారగాః | ఇత్థం కాలో
వ్యతీయాయ యుధ్యతోర్భీషణస్తయోః || 39

అరివర్గకరక్షిప్తా నానాశస్త్రాస్త్రరాశయః | మహామాయప్రభావేణ విఫలా అభవన్ క్షణాత్ || 40

తతో జఘాన సా దేవీ చిక్షుర ప్రముఖానరీన్ | సగణాన్ గదయా బాణై శ్శూలై శక్తిపరశ్వధైః || 41

ఏవం స్వీయేషు సైన్యేషు హతేషు మహిషాసురః | దేవీనిశ్శ్వాస సంభూతాన్ భావయామాస తాన్ గణాన్ || 42

ఆమె యొక్క భయంకరమగు నాదము ఆకాశమంతయు నిండి పెద్ద ప్రతిధ్వని కలిగి ముల్లోకములు క్షోభిల్లెను (31). నాలుగు సముద్రములు చెల్లాచెదరయ్యెను. భూమి కంపించెను. మహిషునిచే పీడింపబడియున్న దేవతలు అపుడు జయశబ్దమును చేసిరి (32). అపుడు ఆ దేవతలు అందరు పరాశక్తి, మహాలక్ష్మి స్వరూపురాలు అగు జగన్మాతను భక్తితో గద్గదమైన వాక్కుతో స్తుతించిరి (33). బాగుగా క్షోభను పొందిన లోకమును గాంచి ఆ దేవ శత్రువులు సైన్యములను సన్నద్ధము చేసుకొని చేతులలో అయుధములనెత్తి పట్టుకొని యుద్ధమునకు సంసిద్ధులై నిలబడిరి (34). మహిషాసురుడు కోపించి ఆ శబ్దమునకు అభిముఖముగా వేగముగా పరుగెత్తెను. అపుడాతడు తన కాంతులచే ముల్లోకములను ప్రకాశింప జేయుచున్న దేవిని చూచెను (35). ఇంతలో మహిషాసురుని చే పాలింపబడే మహావీరులు కోట్లాదిమంది ఆయుధములను దాల్చి అచటకు విచ్చేసిరి (36). చిక్షురుడు, చామరుడు, ఉదగ్రుడు, కరాలుడు, ఉద్ధతుడు, బాష్కలుడు, తామ్రుడు, ఉగ్రాస్యుడు, ఉగ్రవీర్యుడు, బిడాలుడు, అంధకుడు, దుర్ధరుడు, దుర్ముఖుడు, త్రినేత్రుడు, మహాహనుడు అనువారు మాత్రమే గాక యుద్ధ నిపుణులగు అనేక శూరులు యుద్ధరంగములో దేవితో పోరాడిరి. వారు శస్త్రాస్త్ర విద్యలలో నిష్ణాతులు. భయంకరమగు యుద్ధమును ఆ ఇరుపక్షముల వారు చేయుచుండగా ఈ తీరున కొంతకాలము గడిచెను (37-39). శత్రు సైనికుల చేతులనుండి ప్రయోగించబడిన అనేక శస్త్రాస్త్రముల సమూహములు మహామాయయొక్క మహిమచే క్షణకాలములో

విఫలమైనవి (40). అపుడా దేవి గణములతో కూడియున్న చిక్షురుడు మొదలగు శత్రువులను గద, బాణములు, శూలము, శక్తి, గొడ్డలి అను ఆయుధములతో కొట్టెను(41). ఈ విధముగా తన సైన్యములు సంహరింపబడుచుండగా, మహిషాసురుడు దేవియొక్క నిశ్వాసమునుండి పుట్టిన ఆ గణములతో పెనుగులాడ జొచ్చెను (42).

అతాడయత్ ఖురైః కాంశ్చిత్ కాంశ్చిచ్ఛృంగద్వయేన చ | లాంగూలేన చ తుండేన భినత్తి స్మ ముహుర్ముహుః || 43

ఇత్థం దేవీగణాన్ హత్వాభ్యధావత్సో%సురాధిపః | సింహం మారయితుం దేవ్యాస్తతో%సౌ కుపితా%భవత్ || 44

కోపాత్సో%పి మహావీర్యః ఖురకుట్టిత భూతలః | శృంగాభ్యాం శైలముత్పాట్య చిక్షేప ప్రణానాద చ || 45

వేగేన విష్వగ్ భ్రమతా ప్రక్షిప్తా గురవో%ద్రయః | ఆకాశతో మహీమధ్యే నిపేతుర్నృపసత్తమ || 46

శృంగభిన్నాః పయోవాహాః ఖండం ఖండమయోసిషుః | లాంగూలేనాహతశ్చాబ్ధిర్విష్వగుద్వేల మస్పదత్ || 47

ఏవం క్రుద్ధం సమాలోక్య మహిషాసురమంబికా | విదధే తద్వధోపాయం దేవానామభయంకరీ || 48

తతః పాశం సముత్థాప్య క్షిప్త్వా తస్యోపరీశ్వరీ | బబంధ మహిషం సో%పి రూపం తత్యాజ మాహిషమ్ || 49

తతస్సింహో బభూవాశు మాయావీ తచ్ఛిరోంబికా | యావచ్ఛినత్తి తావత్స ఖడ్గ పాణిర్బభూవ హ || 50

సచర్మాసి కరం తం చ దేవీ బాణైరతాడయత్ | తతో గజవపుర్భూత్వా సింహం చిచ్ఛేద శుండయా || 51

తతో%స్య చ కరం దేవీ చకర్త స్వమహాసినా | అధారి చ పునా రూపం స్వకీయం తేన రక్షసా || 52

తద్రైవ క్షోభయామాస త్రైలోక్యం సచరాచరమ్ | తతః క్రుద్ధా మహామాయా చండికా మానవిక్రమా || 53

పపౌ పునః పునః పానం జహాసోద్ర్భాంతలోచనా | జగర్జ చాసురస్సో%పి బలవీర్యమదోద్ధతః || 54

తస్యా ఉపరి చిక్షేప శైలానుత్పాట్య సో%సురః | సా చ బాణావలీ ఘాత్రై శ్చూర్ణయామాస సత్వరమ్ || 55

వారుణీమదసంజాతముఖరాగాకులేంద్రియా | ప్రోవాచ పరమేశానీ మేఘగంభీరయా గిరా || 56

మహిషుడు కొందరిని డెక్కలతో, మరికొందరిని రెండు కొమ్ములతో కొట్టెను. ఆతడు వారిని తోకతో మరియు ముట్టెతో పలుమార్లు కొట్టి చీల్చుచుండెను (43). ఆ రాక్షసరాజు ఈ విధముగా దేవీగణములను సంహరించి ముందునకు ఉరుకుచుండెను. ఆతడు సింహమును కొట్టుటకు ముందునకు ఉరకగా, దేవి చాల కోపించెను (44). మహాపరాక్రమశాలియగు మహిషుడు కూడ కోపించి డెక్కలతో భూతలమును తాడించుచూ కొమ్ములతో కొండను పెకిలించి విసిరి నాదమును చేసెను (45). ఆతడు వేగముతో అడ్డముగా తిరుగుచూ, బరువైన కొండలను ఆకాశమునుండి నేలపైకి విసిరివేయుచుండెను. ఓ మహారాజా! (46) ఆతని కొమ్ములచే తాకబడి మేఘములు ముక్కలు ముక్కలుగా చెల్లాచెదరు అగుచుండెను. ఆతని తోకచే కొట్టబడిన సముద్రము చెలియలికట్టను దాటి ప్రవహించెను (47). ఈ విధముగా కోపించియున్న మహిషాసురుని గాంచి దేవతలకు అభయమునిచ్చే ఆ జగన్మాత వానిని వధించే ఉపాయమును చేసెను (48). అపుడా పరమేశ్వరి వాని పైకి పాశమును విసిరి బంధించెను. వెంటనే ఆ రాక్షసుడు మహిషరూపమును విడిచి పెట్టెను (49). మాయావియగు ఆ మహిషాసురుడు సింహరూపమును దాల్చెను.

వెంటనే జగన్మాత వాని తలను నరుక బోవునంతలో, వాడు చేతిలో కత్తిని పట్టి నిలబడెను (50). చేతిలో కత్తిని, డాలును పట్టియున్న ఆ రాక్షసుని దేవి బాణములతో కొట్టెను. అపుడు వాడు ఏనుగు దేహమును దాల్చి సింహమును తొండముతో లాగజొచ్చెను (51). అపుడు దేవి తన పెద్ద కత్తితో వాని తుండమును నరికివేసెను. అపుడా రాక్షసుడు మరల తన వాస్తవ రూపమును దాల్చెను (52). ఆతడు వెంటనే చరాచరప్రాణులతో గూడిన ముల్లోకములను క్షోభిల్లునట్లు చేసెను. అపుడు గొప్ప పరాక్రమము గలది, భయంకరమగు ఆకారముగలది అగు మహామాయ కోపించి (53), పలుమార్లు పానీయమును త్రాగి కన్నులను త్రిప్పుచూ నవ్వెను. బలము, పరాక్రమము, గర్వములచే కన్ను మిన్ను కనజాలని ఆ రాక్షసుడు కూడ గర్జించెను. (54). ఆ రాక్షసుడు కొండలను పెకిలించి ఆమె పైకి విసిరవేయుచుండగా, ఆమె వెంటనే బాణ సమూహములతో కొట్టి వాటిని పిండి జేసెను (55). పానీయము యొక్క మత్తు వలన ఎర్రనైన ముఖమును కలిగి ఉద్రిక్తములైన ఇంద్రియములు గల ఆ పరమేశ్వరి మేఘగర్జనవలె గంభీరమగు వాక్కుతో నిట్లనెను (56).

దేవ్యువాచ |

రే మూఢ రే హతప్రాజ్ఞ వ్యర్థం కిం కురుషే హఠమ్ | న మదగ్రే%సురాః కే%పి స్థాస్నవో జగతీత్రయే || 57

దేవి ఇట్లు పలికెను -

ఓరీ మూర్ఖా! ఓరీ వినష్టబుద్ధీ! వ్యర్థముగా హఠమునేల చేయుచున్నావు? ముల్లోకములలోని రాక్షసులలో ఎవ్వరైననూ నా ఎదుట నిలబడలేరు (57).

ఋషిరువాచ |

ఏవమాభాష్య కూర్దిత్వా దేవీ సర్వకలామయీ| పదాాక్రమ్యాసురం కంఠే శూలేనోగ్రేణ సా%భినత్ || 58

తతస్తచ్ఛరణాాక్రాంతస్స స్వకీయముఖాత్తతః | అర్ధనిష్క్రాంత ఏవాసీద్దేవ్యా వీర్యేణ సంవృతః || 59

అర్ధనిష్క్రాంత ఏవాసౌ యుధ్యమానో మహాధమః | మహాసినా శిరో భిత్త్వా న్యపాతి ధరణీతలే || 60

హాహాశబ్దం సముచ్చార్యావాఙ్ ముఖాస్తద్గణాస్తతః | పలాయంత రణాదీ్భతాాస్త్రాహి త్రాహీతి వాదినః || 60

తుష్టువుశ్చ తదా దేవీమింద్రాద్యాస్సకలాస్సురాః | గంధర్వా గీతముచ్చేరుర్ననృతుర్నర్తకీజనాః || 62

ఏవం తే కథితో రాజన్ మహాలక్ష్మ్యాస్సముద్భవః | సరస్వత్యాస్తథోత్పత్తిం శృణు సుస్థేన చేతసా || 63

ఇతి శ్రీ శివమహాపురాణ    ఉమా సంహితాయాం మహిషాసురవధో నామ షట్ చత్వారింశో%ధ్యాయః (46).

ఋషి ఇట్లు పలికెను -

సర్వకళాస్వరూపురాలగు ఆ దేవి ఇట్లు పలికి వానిపైకి ఉరికి కాలితో ఆ రాక్షసుని కంఠమునందు తొక్కి పెట్టి భయంకరమగు శూలముతో పొడిచెను (58). అపుడు ఆమె పరాక్రమముచే కప్పివేయబడి ఆమె పాదములచే త్రొక్కివేయబడియున్న ఆ మహిషుడు తన నోటినుండి బయటకు రాబోతూ సగము మాత్రమే రాగలిగెను (59). మహాధముడగు ఆ రాక్షసుడు నోటినుండి సగము బయటకు వచ్చియూ యుద్ధము చేయుచుండెను. అపుడామె పెద్ద కత్తితో వాని తలను నరికి నేలపై పడవేసెను (60). అపుడు వాని సేనలు 'అయ్యో! అయ్యో!' అంటూ బిగ్గరగా పలికి తలలను వంచుకొని భయపడినవారై యుద్ధమునుండి పారిపోతూ 'రక్షించుడు,

రక్షించుడు' అని పలుకుచుండిరి (61). అపుడు ఇంద్రుడు మొదలగు దేవతలందరు దేవిని స్తుతించిరి. గంధర్వులు పాటలను పాడిరి. నాట్యకత్తెలు నాట్యమాడిరి (62). ఓ రాజా! ఈ విధముగా నేను మహాలక్ష్మీప్రాదుర్భావమును నీకు చెప్పితిని. అదే విధముగా సరస్వతీ ప్రాదుర్భావమును స్వస్థమగు మనస్సుతో వినుము (63).

శ్రీ శివమహాపురాణములోని ఉమాసంహితయందు మహిషాసురవధ అనే నలుబది ఆరవ అధ్యాయము ముగిసినది (46).